

# శ్రీరామశతకము

గ్రంథకర్త.

చిరుదురాజు వెంకటసుబ్బరాజు.

నల్లపల్లియగ్రామము

శ్రీప్రభవనామ సంవత్సర. చైత్రము

ప్రొద్దుటూరు పావకీముద్రణాలయమున ముద్రితము.

1927.

# అభినందనము

సీ॥ శ్రీకరంబైనట్టి క్షితిని నక్కలదిన్నె
పురమందువిలసిల్లు పుణ్యులనగ
పడకంటి యనెడు సద్వంశమం దుదయించు
బాసిరెడ్డింటి పేర్వడయునట్టి
చిన్నాగిరెడ్డికి గన్నకుమారుడౌ
వెంకటరామాఖ్య వెలయునతడు
మఱియు గానుగవంశమాన్యుండు సుగుణుండు
పాలూరు గురువయ్య భక్తవరుడు

తే॥ వీరలిర్వురు ప్రీతిచే వేగిరముగ
యచ్చుగూర్పింపుడని శ్రద్ధననుదినంబు
ప్రోత్సహింపగ నేమదినుత్సహించి
యచ్చుగూర్పించి యొసఁగితి హరికిఁబ్రీతి.

గ్రంథకర్త.

# విజ్ఞప్తి

శ్రీమత్సద్గుణ రత్నాకరులగునో పండితోత్తములారా.

విశేషపాండిత్యమునందొక్కింతయు నేసముపార్జించినవాఁడగాకుండినను నాకుగలసర్వదా, భగవన్నామ సంకీర్తనోత్సాహంబున శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు శ్రీ రామ మూర్తికంకితముగా. నేనీశతకమునురచించి మత్ప్రయత్నంబీడేర్చుకొనసంతసించితినిగాన, యిందేలోపములున్నను సంశోధింపక మీానందనమువలె నన్నందఱుకృపగాంతురని ముందుగా మీాకందఱకు నావందనశతము లర్పించు చున్నాడను.

ఇట్లు

స్కూల్‌మాష్టరు. నక్కలదిన్నెగ్రామము } బిరుదురాజ వెంకటసుబ్బరాజ నల్లపల్లియగ్రామము

# అంకితము.

సీ॥ ఆత్రేయమాని సద్గోత్రజాతుఁడు యజు
శ్శాఖాసమాయుక్తి జరగునట్టి
సుచిరబిరుదు రాట్సుబ్బరాజాఖ్యుని
సూనుఁడ వెంకటసుబ్బరాజ
నగునేను రామునకంకితముగ నొక్క
శతకముగరచియించి సంతసమున
నొసఁగితి దీనిలో నుండినదోసముల్
గణియింప కనుబ్రీతిఁ గైకొనుండు

తే॥ రామనామంబు మీఱుమంత్రంబులేమి,
భక్తితో రచియించితిఁ బద్యములను
నాదుప్రథమ ప్రయత్నంబు, నాదరించి
కృపనుమన్నింపుఁడో బుధశ్రేష్ఠులార!

గ్రంథకర్త

శ్రీభార్గవ్యైనమః

# శ్రీ రామ శతకము.

శ్రీవర! జగదుద్ధారా!
కావర ముచుకుంద వరద! కాకుత్స్థమణీ!
సేవకుఁడని నీమదిలోఁ
గావన్ సంప్రీతి నేలు కేశవ! రామా! 1

కం॥ దేవాధిప! నిరతమునీ
భావంబునఁ జూడు దీనబంధూ! శౌరీ!
కేవల భక్తుండనుచును
గైవల్యప్రాప్తినిమ్ము కరుణను రామా! 2

కం॥ రామా! నుతవిబుధముని
స్తోమా! గుణధామ! రాజసోమ! సురేశా!
కామారినుత! పరాత్పర!
ప్రేమమ్మున శ్రేయమొసఁగవే రఘురామా! 3

కం॥ కందర్పజనక! కేశవ!
సుందర గోపాలబాల! సురుచిరశీలా!
సందియ మొందక పుణ్యము
లందుటకున్ మార్గమొసఁగు మయ్యా! రామా! 4

కం॥ పాపుఁడటంచని మదిలోఁ
గోపంబేమాత్రమైనఁ గూర్పక నాబల్
తాపానలంబుఁ బాపుము
తాపసమందార! ధీర! దశరథరామా! 5

క॥ నమ్మితి త్వన్నామస్మృతి
నెమ్మనమున సమ్మదముగ నినునమ్మితినా
కిమ్మా! సుఖములు; కృపఁజే
కొమ్మా! నావందనముల గొబ్బునరామా! 6

క॥ చిక్కితి దుర్దశలను నే
దిక్కుఁగనుఁ గొనఁగలేక దీనుఁడనై నీ
ప్రక్కనఁ జేరితి మోక్షము
చక్కఁగఁగనఁ జేయవయ్య జనవర! రామా! 7

క॥ కలుషారీ! కరుణాలయ!
యిల నెవ్వరు సాటినీకు నినకులతిలకా!
సలలితవిబుధ జనార్చిత
జలరుహాదళనయన! శేషశయనా! రామా! 8

క॥ మందుఁ డటంచని మదిలో
సందేహమువలదు పుణ్యచారిత్ర! ధరా
నందననందిత కల్మష
బృందాపహారా! మదారి విదళన! రామా! 9

క॥ మరియాదలేని వాఁడని
విరసమునఁ జూడకయ్య విశ్వాత్మక నే
వరభక్తుఁ డటంచనిమదిఁ
బరికించి శుభంబొసంగు పావనరామా! 10

క॥ ఉదయాస్తమయంబుల నీ
పదకమలములఁ భజించుభక్తుండని నఁ
మదిలోనఁదలచి భాగ్యా
స్పదుఁజేయు మురారిశౌరి వరదా రామా! 11

క॥ అంగము లుప్పొంగుచు నీ
శృంగారము నవారవాంబు నీక్షింపకనే
ముంగోపి నైయఘంబుల
కుంగారణమైతి విడువకుము శ్రీరామా: 12

క॥ రాక్షస మదదమనా! ఖల
శిక్షాచణ మానిబృంద సేవితచరణా!
పక్షీంద్రవాహనా! కరి
రక్షక! మోక్షంబొసంగు రవికులరామా 13

క॥ కుంజరపోషక! నరవర
కుంజర! కరుణాసముద్ర! కోమల దేహా!
కంజాక్షు! వాసుదేవ ని
రంజన శ్రీకృష్ణ! విజయరాఘవ! రామా! 14

క॥ పశుపతి నుతగుణజాలా
శశిరవినేత్రా! పయోధిశయన సుశీలా
వశమా నెనిన్నుఁ బొగడఁగ!
విశదంబగు కుశలమొసఁగవే! శ్రీరామా! 15

క॥ కరివరద! గరుడగమనా!
నిరతంబెనజపముఁజేయు నిర్మలుఁడను నీ
మరియాద దప్ప కేలుము.
పరిపూర్ణమృగాంక వదన! పావన రామా! 16

క॥ క్రోలితి నీనామామృత
మేలితిపంచేంద్రియముల నేర్పడమదిలోఁ
గీలించితి నీపదములు
శ్రీలోలాభక్తజన వశీకర రామా! 17

క॥ ఉరగశయన! కరుణాకర
పరమాత్మా! పరమపురుష! పాపవినాశా!
సురమానిబృందపాలా
వరమొసఁగుము పుణ్యజాల! వసుధను రామా! 18

క॥ ఎప్పుడునినే మదిలోఁ
దప్పకనుతియించు వాఁడఁదామరసాక్షా.
గొప్పగఁ జూపు దయారస
మొప్పగ వైకుంఠనిలయ! యో శ్రీరామా! 19

క॥ వాసవనుత నీపదములు
వేసారకనమ్మినాఁడ విబుధార్చితనా
దోసములెల్లను బాపుము
భాసురగుణజాల! భక్తపాలన! రామా! 20

క॥ ఘనమగు త్వద్దాస్యంబును
గనుఁగొను భాగ్యంబునిమ్ము కమలాధీశా!
సనక సనందన నారద
ఘనతాపసవంద్య! దీనగణహిత రామా! 21

క॥ కేశవ శ్రీహరియనినిను
నాశన్ భజియించు నట్టియర్థిన్ విడిధా
శ్రీశా! యేరిని బ్రోచెదు
దాశరథీనన్నుఁ బ్రోవు తప్పక రామా! 22

క॥ గుణగణ భూషితభక్తా
వన! ఘన! కృష్ణ! బుధవరద! మురారీ!
యనుపమవిక్రమ! రఘుసూ
దన! ధనదార్చితసునామ! దశరథ రామా! 23

క॥ శిక్షించితివి సురారుల
వీక్షించితికనికరమున విబుధుల నెల్లన్
రక్షించితివి విభీషణుఁ
గుక్షిందాల్చితివి భూతకోటిని రామా! 24

క॥ దయ్యములకు నెదగాలము
నెయ్యము నీనామజపము నిరతమునాకున్
జయ్యనదరిఁ జేర్పుము మా
యయ్యా! నినుమఱువనేల మర్త్యకు రామా! 25

క॥ కుండలిశయనా! మునునే
దండముఁగావంగలేవ దానవహరణా!
దండములు గూర్తుకొను భూ
మండల పతివినుతనామ! మాధవరామా! 26

క॥ నీరజలోచన నాదగు
నేరంబులుదిద్ది మంచినియతినొసఁగవే
కోరినుతించెదఁ గలుషవి
చారుండనిమఁజువ వలదు జనవరరామా! 27

క॥ కల్లరియని విడనాడకు
ముల్లాసముమానఁబోకు. ముర్వీశ!హరీ!
చల్లని చూట్కులఁగను శ్రీ
వల్లభ! నన్ఁబ్రోవ నీదెభారము రామా. 28

క॥ వెన్నుఁడ రారా! ననుగడు
మన్ననతోఁ బ్రోవవేర! మాధవ! యిదె! నా
విన్నప మాలింపుము ముద
మెన్నఁగనిన్వేడు వాఁడ నిదె శ్రీరామా. 29

క॥ సందియమొందకు. జమఁడని
బృందారకవరద పోవు! వేగ ముకుందా!
మందరధర దశరథనృప
నందన! నినునమ్మినాఁడ నరవరరామా! 30

క॥ సంసారాబ్ధిని మునిఁగిన
హింసాత్మ్నుఁడటంచు నెంచి యిటువిడిచెదవే
హంసాబ్జనేత్ర! పాపము
ధ్వంసంబొనరించి కావు దశరథరామా! 31

క॥ ఉత్తాన పాదుపుత్రకు
నెత్తెఱఁగునఁ గాచియుంటి వింతకుమును నీ
వత్తెఱగుననను గావుము
చిత్తమునీపదములందుఁ జిక్కెనురామా! 32

క॥ కోపమునాపైఁ జూపకు
భూపాలా! పురుషసింహా! భుజగశయానా!
యేపారు హర్షమొసఁగుము
రాపేలదయాసముద్ర. రాఘవ! రామా! 33

క॥ వ్రాలితి త్వచ్చరణంబులఁ
గ్రోలితినీ నామరసము కుంభినిలో నే
జోలియు నేఁజాలించితి
నేలితి విశనిర్భయుండ నేదగరామా! 34

క॥ ఇనకుల తిలకా! కవినుత!
ఘనముగ నీసాటిగలరె కలజగముల నే
ననుదినము ప్రణతు లిడుదును
గనికరమున నన్నుఁజూచి కావుమురామా! 35

క॥ ఎక్కడఁ జూచిన నీవే
రక్కసులఁ గూల్చి తనుచు వ్రాసిరివిబుధుల్
చక్కని త్వచ్చారిత్రము
మక్కువనుతియించువాఁడ మహిలో రామా! 36

క॥ సీతాపతి నామునవిని
నేతీఱునఁ జూడఁగలవో యెల్లప్పుడు నా
చేతోంబుజమున నిన్నిడి
ఖ్యాతిగనుతియింతు భక్తగణనుతరామా! 37

క॥ వంముఱి దాల్చిన తేఁడా!
యింనొక్కరునీకు సాటియే కామితమౌ
ఫలము లొసంగెదు సేవక
సులభుఁడ ననుబ్రోవుమాజనుత! రఘురామా! 38

క॥ కాంచితిన్ దూపంబును
బెంచితిపూజార్హ విధులు. బ్రీతిఁ మదిసే
వించితిఁ బరువడి గనుగడు
నంచితవైకుంఠవాస హరిశ్రీరామా 39

క॥ అపరాధిని నేపమెన్నకు.
కృపఁజూడుము లోకజనక యెంతయుమదిలో
నుపమింత లేనిచపలుని
యపయశమొసఁజేసి కావవయ్యా రామా. 40

క॥ నమ్ములు పల్కెడువాఁడని
నమ్మితిగా నన్నుఁ బ్రోవ జనుదేవేమో.
ద్రిమ్మరి మూర్ఖుఁడనైనను
నిమ్మహినీపూజఁ జేతు నినకులరామా! 41

క॥ సంకటహార గోవిందా
పంకజనాభా సరోజబాణోపమయో
శంకరనుతముని సంస్తుత
కొంకకననుఁ గావుమయ్య కోరితిరామా! 42

క॥ నీసేవలు కడుభక్తిని
వేసారక సల్పునట్టి వీఁడెల్లపుడున్
జేసెడి దురితము లెల్లను
దోసిక్రపాకరుఁడవగుము దూఢిగ రామా! 43

క॥ దేవకికూరిమిసుతు నిను
భావంబున నమ్మినట్టి భక్తుండనుచున్
గావు మొకింతముదంబునఁ
గైవల్యాధిప ముకుంద!కరుణను రామా! 44

క॥ అండజవాహా! ననునీ
యండను జేర్పంగవలయు నహరహమును గో
దండధరా కరుణానిధి
దండధరుని బాధదీర్చు దశరథరామా. 45

క॥ కాపాడుము కరుణాకర
మేపారఁగనను దినము సురేశ్వరవినుతా!
యాపద్బాంధవ కేశవ
శ్రీపతినినునమ్మినాఁడ సిద్ధము రామా! 46

క॥ రంగగునీ చరితము విన
సంగములుప్పొంగసాగె నవనీశ్వరన్
చంగున నీదరిఁజేర్పుము
రంగహరా రంగశయన రాఘవరామా! 47

క॥ తారక నామా విబుధ
స్మారక చిహ్నమగునీదు మహితాకృతి నే
సారెకు నుతియించుచు నా
కోరిక లలరంగనిన్నుఁ గొల్చితి రామా! 48

క॥ లోకేశ శ్రీకరా హరి
రాకాశశి వదనసకల రాజబిడౌజా!
పాకారి పుత్రహరణా
నీకొసగెద వందనము లనేకము రామా! 49

క॥ యిచ్చితి వందనములు నే
మెచ్చితి నీనామజపము మేదినిలోన్
జెచ్చెరఁ జూపుమురూపం
బచ్చపు భక్తుండటంచు నవనిని రామా! 50

క॥ గోవింద గోపబాలా
నావందనములను గొనుచు నారదురీతిన్
బ్రోవందగు విజ్ఞానము
భావంబునఁ గలుగఁజేయు బాగుగ రామా! 51

క॥ కుతుకంబున సమ్మతినన్
వెతలన్ బెట్టకుము నేఁడు విశ్వాత్మక నే
క్రతువులఁ జేయ నెఱుంగను
మతమే నీనామ మతము మరగితి రామా! 52

క॥ విత్తవిహీనుఁడ నైనన్
జిత్తము నీనామజపమె సేవించె హరీ
మొత్తమున నీదు భక్తుఁడ
నుత్తమకైవల్యమొసఁగు మొప్పగ రామా! 53

క॥ క్రతువులు చేయఁగ విత్తము
గతిలేదెటు బోగు చేతుఁగానిపని హరీ
హితమగు త్వన్నామస్మృతి
కృతులన్ గొనియాడువాఁడ నెప్పుడు రామా! 54

క॥ నిక్కంబాడుట లెఱుఁగను
జక్కారవిలు కానితండ్రి సద్గురుమూర్తీ
తొక్కారవలె మదుగున పెం
పెక్కచరింతిచిని బోపవే! శ్రీరామా! 55

క॥ తెలియని మూర్ఖత్వంబున
బలియుఁడనని విఱ్ఱవీఁగి భక్తిఁ దెలియకే
సలలితవిబుధజనంబుల
జులకచూట్కులను జూచుచుంటిని రామా! 56

క॥ చిఱుప్రాయంబున నుండియుఁ
బఱువడిగాఁ జేయనైతిఁ బాపపుఁబనులన్
దిరముగనిను నుతియించెద
మఱువక దరిఁ జేర్చుకొమ్ము మాధవ రామా! 57

క॥ లెక్కకుమిక్కుట మౌకపుఁ
గక్కురితిపనులను జేయఁ గల్గితి భువిలోఁ
డక్కరి నీచుండని నీ
మక్కువ మానంగవలదు మహిజాలో రామా! 58

క॥ కపటినయి కొన్నినాళ్లను
విపరీతపుఁగోపినయ్యు వెసఁగొన్నాళ్లన్
జపలమతినయ్యుఁ గొన్నా
ళ్లపరాధమొనర్చినాఁడ నయ్యా! రామా! 59

క॥ రక్కసివలెఁ గఠినత నే
మక్కువతోఁ బూనిమహిని మరగితిహింసన్
చిక్కితి నఘముల పాలిఁట
నక్కమునీదయనొసంగు నేర్పనరామా! 60

క॥ దీనార్తిపాలనా హరి
శ్రీనాయక వేంకటేశ చిన్మయరూపా!
యేనాఁడు దుష్టమతియని
పోనాడక శుభమొసంగు భూమిని రామా! 61

క॥ ప్రేమాస్పదమై తగునీ
నామామృతరసముఁ గోరిల నాతరమగునే!
శ్యామాంగ నీమహత్త్వం
బేమాత్రం బెఱుఁగనైతి నిల శ్రీరామా! 62

క॥ అంతయు నీభారంబని
చింతలువిడనాడి సేవచేయఁగనైతిక్
బంత్తము పూనక ననునీ
మంతనమునఁ జక్కఁజూడు మక్కువరామా! 63

క॥ మాపుము నీరూపంబును
బాపుముదుష్కృతము లెల్లబాయనికృపతో
నాపుము పేకటికంబును
శ్రీపతి హరి శ్రీనివాస శ్రీరఘురామా! 64

క॥ నిగమోద్ధార రమావర
ఖగవాహన కమలనాభ కాంచనచేలా
పగవానివలెను జూడక
నగధర బ్రోవంగదయ్యా నను శ్రీరామా! 65

క॥ నిగమాంత వేద్య సదయా
సుగుణంబులరాశివనుచు సుస్థిరమతితో
నగణిత వైభవ నిన్నదిఁ
బొగడెద భక్తుండనన్నఁ బ్రోవుము రామా! 66

క॥ పట్టితినీపదములు నేఁ
బెట్టితి దిరునామమలిక పీఠిని వెడలన్
గొట్టితి సంశయములు నే
గుట్టుగ బాలింపు ప్రేమఁ గోరితి రామా! 67

క॥ పట్టెండన్నము పట్టెడు!
పొట్టకొఱకునీచుసేవ భూస్థలిలోనన్
గుట్టుగ జేయంసాగిన
కట్టండనిమఱువ వలదు కరుణను రామా! 68

క॥ వేసారక నీ నామము
భాసురముగనమ్మినాడఁ బంకజనేత్రా
గాసిం బెంచకుననుశ్రీ
దాసార్చిత నిగమనిలయ దశరథ రామా! 69

క॥ కష్టము లెల్లను బాపుము
దుష్టుండని యీసుచెంది త్రోయకు ననుసం
తుష్టుని జేయుము మురహర
శిష్టజనావన రమేశ శ్రీరఘురామా! 70

క॥ కడ కేయాపద లొదవినఁ
గడువడిగా నీదుజపము ఘనముగఁ జేతుఁ
దడయక చూపు దయారస
మెడసేయకుమయ్య నన్ను నీయెడ రామా! 71

క॥ మంగళకర వేదము. వే
దాంగంబులు! నుపనిషచ్ఛ్రయంబుల నెఱుఁగఁ
రంగగునీ కరుణారస
ముంగురిపింపంగదయ్య మురహార రామా! 72

క॥ కొనియాడఁదరమె నీదగు
ననుపమవిక్రమపరాక్రమైశ్వర్యములన్
గనులారఁ గాంచవలె నని
ఘనకౌతుక ముప్పతిల్లెఁ గావవె రామా! 73

క॥ ఎదయందునఁ గడుభక్తిని
నుదయాస్తమయంబులందు నొప్పగ మదిలో
మదనజనక కేశవ యని
కుదురుగనీ నామమెపుడుఁ గొలిచెద రామా! 74

క॥ హనుమంతుని గుణగణములఁ
గనుఁగొని ప్రోవంగ లేద కరుణాకర! యో
మనసిజరూపా! నిర్జర
మునిపాలా సుగుణ శీల మురహార రామా 75

క॥ శిరసావహించి ముదమునఁ
దిరుపాదములొత్తువాఁడ దినదినమును నే
మఱినిర్దయ వహియుంపక
పరిపూర్ణశ్రేయమొసఁగు పావనరామా! 76

క॥ కంజాతనేత్ర రాక్షస
భంజన ప్రహ్లాద పోష భజియించెద నే
కుంజరనాయకపోషక
సంజయవంతునిగఁ జేయు నరవరరామా! 77

క॥ రతిపతిజనకా నిన్మది
నతులితముగ వేడినాడఁ నాపదవీడ్గా
హితవులు గలుపుము దశరథ
సుత సుగ్రీవాదివినుత సురవర రామా! 78

క॥ దీపము చీకటి బాపను
తాపసులనుగావనీవు దక్షులు జగతిన్
బాపవె యజ్ఞానాంధత
శ్రీపతి వైకుంఠనిలయ శ్రీరఘురామా! 79

క॥ కమలాధవ కరివరదా
విమలాత్మక విబుధపోష వేదవిచారా
రమణీమణి ద్రౌపది మా
న్యములంబుననిన్ను వేడఁ గావవె రామా! 80

పదుల మేటి దేవత
నీసరిఁ బాపులకును నధముఁడనన్నో
వంశచంద్ర ప్రోచిన
ఎవినన్వర్థంబునీ ప్రభుత్వము రామా! 81

క॥ జగము శ్రీరమణా యనియది
నియతిని బొనరించువాడ నీదగుపూజల్
భయమును బాపికృపంగను
జయత్రిజగన్మోహనాంగ జయరఘురామా! 82

క॥ గురుఁడవు వరకరుణా భా
సురుఁడవు భువనైకపూజ్య సుచరితుఁడవు నీ
నిరుపమ సాహసమెన్నఁగ
హరిహాయునకునైనఁ దరమె హరి శ్రీరామా! 83

క॥ ము మెనఁ బొదలఁగనినునేఁ
గుదురుగనిష్కామగతిని గొప్పగపూజల్
పదిలంబుగ నొనరించెద
నదలింపుమఘంబులెల్ల హరి శ్రీరామా! 84

క॥ నిద్రాహారము లొందక
ముద్రలనిరుపొందుఁదాల్చు మునిగానుహరీ
త్వద్రూపంబే ముద్రిక
భద్రంబనినమ్మినాఁడ భక్తినిరామా! 85

క॥ తాపసనందార్య నీకృపఁ మునునే
జూపుమునీభక్తుడంచు నుసుతిని నాకుఁ
బాపుము కల్మష బృందము మా!
తేపారఁగఁ జూపు రూపమిక శ్రీరామా!

క॥ తలచితి త్వన్నామస్మృతి
నిలిచితిగడునిష్ఠతోడ నిర్మలబుద్ధిన్
గలసితి సూరిజనంబులఁ
బిలచితిరక్షింపనన్నుఁ బ్రీతిగ రామా!

క॥ జోహారులిడెదఁ గొనుమో
శ్రీహరివైకుంఠనిలయ సింధుగభీరా
నూహాలోక్తి నాకొసంగుము
సాహససద్ధర్మనిరత జనవర రామా!

క॥ దీనజనవత్సలాముసు
గానవెభక్తార్థ ఫులనుగసుశాద్భృష్టిన్
మానీంద్ర పోషకా నే
గానను నీమహిమఁ జూపుకిరణను రామా•

క॥ ననుగాడ్పుదిండి పాన్పున
ఘనముగ శయనింపఁ గమలచరణములొత్తన్
గనిమోదంబందిన నీ
మనమున ననుఁగనుర మేలి మక్కువ రామా!